శా. “బావా! నీ వచనంబు నిక్కము సుమీ; ప్రాణుల్ గతజ్ఞాను లై
నీవే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతామోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వరూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై” ||162||

## 20 కంసునికి మంత్రుల సలహా

వ. అని యిట్లు బ్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ బడసి
కంసుం డింటికిం జని యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం
గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్ర
వలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగిం
చిన, నపుడు వార లతని కిట్లనిరి. ||163||

క. “ఇట్టయినఁ దడయ నేటికి?
పట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్
బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ
బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా! ||164||

మ. భవదీయోజ్జ్వల బాహు చాప విలసద్బాణావళీ భగ్నులై
దివిజాధీశ్వరు లే క్రియంబడిరొ యే దేశంబులం డాఁగిరో
శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మౌని వృ
త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపం దగున్ వల్లభా! ||165||

క. నొచ్చిరి శాత్రవు లనుచును
విచ్చలవిడిఁ దిరుగ వలదు వివిధాకృతులన్
మ్రుచ్చిలివత్తురు వారలు
సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్. ||166||

క. ఒత్తికొనుచురానీఁ జనఁ
దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను
త్పత్తి సమయములఁ జెఱుపక
మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్. ||167||

మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డా చక్రి యేధర్మమం
దమరున్; గోవులు భూమిదేవులు దితిక్షామ్నాయ కారుణ్య స
త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధాశాంతులు న్విష్ణుదే
హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్. ||168||

వ. కావున. ||169||

ఉ. చంపుదు మే నిలింపులను? జంకెల ఱంకెలఁ దాపసావళిం
బంపుదు మే కృతాంతకునిపాలికిఁ? గ్రేపులతోడ గోవులన్
ద్రుంపుదు మే? ధరామరులఁ దోలుదు మే? నిగమంబులన్ విదా
రింపుదు మే? వసుంధర హరింపుదు మే? జననాథ! పంపుమా.’ ||170||

వ. అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణ

నిరోధంబు నిషేధం బని తలంపక కాలపాశ బద్ధుం డయి వి
ప్రాది సాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురం
బునకుం జనియె; ననంతరంబ యా రక్కసులు వెక్కసంబు
లగు మొక్కలంబుల సజ్జనులపజ్జలంబడి తర్జన గర్జన భర్జ
నాది దుర్జనత్వంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి. ‖171‖

ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల
నడఁప వారి బలము లణఁగిపోయె
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు
నార్యహింసచేయ నడఁగుఁగాదె. ‖172‖

## 21 కృష్ణునికి జాతకర్మచేయుట

వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి
మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలం
బులాడి, శుచియై శృంగారించుకొని, స్వస్తి పుణ్యాహ వచనం
బులు చదివించి, జాతకర్మంబు జేయించి, పితృదేవతల నర్చించి
క్రేపులతోడఁగూడఁ గైజేసిన పాఁడిమొదవుల రెండులక్షలను గనక
కలశ మణి వసన విశాలంబు లైన తిల శైలంబుల లేడింటిని
భూదేవతల కిచ్చిన. ‖173‖

క. “ఈ యాభీరకుమారుఁడు
శ్రీయుతుడై వీరవైరిజేతయునై దీ
ర్ఘాయుష్మంతుం” డగు నని
పాయక దీవించి రపుడు బ్రాహ్మణ జనముల్. ‖174‖

క. దుందుభులు మొరసె; గాయక
సందోహము పాడె; సూత సముదాయముతో
వందిజనులు కీర్తించిరి
క్రందుగ వీతెంచె భద్రకాహళ రవముల్. ‖175‖

క. పల్లవ తోరణసురుచిర
వల్లీధ్వజరాజిధూపవాసనములతో
సల్లలితములై యొప్పెను
వల్లవవల్లభుల యిండ్ల వాకిం డ్లెల్లన్ ‖176‖

క. పసుపులు నూనెలు నలఁదిన
పసఁ దనరి సువర్ణబర్హిబర్హప్రభతోఁ
మిసిమి గలిగి వెలుగొందుచుఁ
బసు లన్నియుఁ మందలందుఁ బ్రసరించె నృపా! ‖177‖

క. క్రేళ్ళుఱికి మసలె లేఁగలు;
మల్లడిగొని ఱంకె లిడియె మదవృషభంబుల్;
పెల్లుగ మొదవులు పొదుఁగుల
జల్లించెం బాలు బాలుసంభవవేళన్ ‖178‖

క. ఆరఁగఁ జదివెడి పొగడెడి
వారికి విద్యలను బ్రతుకువారికి లేమిం
జేరిన వారికి నెల్లను
గోరక మును నందు డిచ్చె గోధనచయముల్. ||179||

వ. ఆ సమయంబున. ||180||

క. కంచుకములు తలచుట్లును
కాంచన భూషాంబరములుఁ గడు మెఱయఁగ నే
తెంచిరి గోపకు లందఱు
మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. ||181||

క. ఏతెంచి చూచి చెలఁగుచు
నేతులఁ బెరుఁగులను బాల నీళ్ళను వెన్నం
బ్రీతి వసంతము లాడిరి
యాతురులై సరసభాష లాడుచు గొల్లల్. ||182||

వ. తదనంతరంబ. ||183||

ఆ. "ఏమినోము ఫలమొ యింత ప్రొ ద్దొక వార్త
వింటి మబలలార! వీను లలర
మన యశోద చిన్నిమగవానిఁ గనె నట
చూచి వత్త మమ్మ! సుదతులార!" ||184||

వ. అని యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన
తత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు
వెలువడి. ||185||

క. జడగతులును బలుపిఱుదులుఁ
బిడికెడు నడుములును వలుఁద బిగి చనుఁగవలున్
వెడఁద నయనములు సిరి తడఁ
బడు మోములు భ్రమరచికురభరములు నమరన్. ||186||

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోద యింటికిన్
జేడియ లేగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్. ||187||

వ. చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి. ||188||

## 22 జలకమాడించుట

తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి
బోరుకాడించి "హరిరక్ష పొ" మ్మటంచు
జలము లొక కొన్ని చుట్టి రాఁజల్లి తొట్ల
నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల. ||189||

క. “జోజో కమలదళేక్షణ!
జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!
జోజో పల్లవకరపద!
జోజో పూర్ణేందువదన! జోజో” యనుచున్. ॥190॥

వ. ఇ వ్విధంబున. ॥191॥

క. పలు తోయంబులు జగములఁ
బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా
పలుతోయగాఁడు వల్లవ
లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్. ॥192॥

క. లోకములు నిదుర బోవఁగ
జోకొట్టుచు నిదురబోని సుభఁగుడు రమణుల్
జోకొట్టి పాడ నిదురం
గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్. ॥193॥

సీ. ఏ బాము లెఱుగక యేపారు మేటికిఁ
బసుల కాపరియింటఁ బాము గలిగె;
నే కర్మములు లేక యెనయు నెక్కటికిని
జాత కర్మంబులు సంభవించె;
నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోడ య
శోద చన్నులపాల చొరవ నెఱిఁగె;
నే హాని వృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు
పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె;
తే. నే తపములనైన నెలమిఁ బండనిపంట
వల్లవీ జనముల వాడఁ బండె;
నే చదువుల నైన నిట్టిట్టి దనరాని
యర్థ మవయముల నంద మందె. ॥194॥

మ. చెయువుల్ చేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు సంతోష దృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనుని మాడ్కిం బొల్చు రోషించియు
న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును సుఖానందంబునం బొంది త
న్మయుడై బ్రహ్మముభాతి బాలుఁడమరున్బాహుళ్య బాల్యంబునన్. ॥195॥

వ. అ య్యవసరంబున ॥196॥

## 23 నందుడురోహిణిమన్నించుట

ఆ. కొడుకుఁ గన్న వేడ్క కొనసాగ రోహిణిఁ
జీరఁ బంచి చిత్రచేలములను
మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా
యంబుజాక్షి ప్రీతయై చరించె. ॥197॥

## 24 నందుడువసుదేవునిచూచుట

వ. అది మొదలు మొదవుల కదుపులు పొదువులు గలిగి యుడె;
నంత నందుండు గోపకుల ననేకుల గోకుల రక్షకు దక్షు లైన
వారిని నియమించి మథురకుం జని కంసునకు నేఁటేఁటం బెట్టెడి
యరిం బెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగా
దర్శించిన. ||198||

క. నందుని గనుఁగొని ప్రాణముఁ
బొందిన బొందియునుఁ బోలెఁ బొలుపారుచు నా
నందాశ్రులు గడకన్నుల
గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్. ||199||

వ. మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనునింగాఁజేసి, వసుదేవుండు
దన కొడుకువలని మోహంబు దీపింప నందుని కిట్లనియె. ||200||

క. “సంతతి లే దని మును ఘన
చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్
సంతతి గలిగెను భాగ్యము;
సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే? ||201||

క. పొడగంటి నిన్ను బ్రతికితిఁ
గడచితి నాపదల నింకఁ గార్యములం దే
యెడమడుగు లేని నెచ్చెలిఁ
బొడగాంచుట చచ్చి మరలఁ బుట్టుటగాదే. ||202||

క. పలుపాటులఁబడు జనులకు
నిల నొకచో నుండఁ గలదే? యేఱులవెంటం
గలసి చను మ్రాఁకు లన్నియుఁ
బలువెంటలఁ బోవుఁగాక పాయక యున్నే? ||203||

మ. పలు రోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?
గొలఁకుల్ వాగులు వారిపూరితములే? గోష్ఠప్రదేశంబులం
బులులున్ దుప్పులు సంచరింపవుగదా; పొల్పారునే ఘోషముల్?
కలవే పచ్చని పూరిజొంపములు తత్కాంతార భాగంబులన్? ||204||

క. తన పుత్ర మిత్ర ముఖరులఁ
దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్
మనుచు గృహమేధియాశ్రమ
మున నుండెడువాని కొక్క మోదము గలదే? ||205||

క. నీ కాంతయొద్ద నీవును
నీ కాంతయు గారవింప నినుఁ దండ్రిగ నా
లోకించుచు నీ మందను
నా కొడు కున్నాఁడె? నంద! నందాన్వితుఁడై.” ||206||

## 25 వసుదేవనందులసంభాషణ

వ. అనిన నందుం డిట్లనియె. ॥207॥

శా. “నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము
న్నీకంసుండు వధించె; మీ సుతఁ దుదిన్ హింసింపఁ జే తప్పి తా
నాకాశంబున కేగె; బాల యిది; దైవాధీనమాపద్దశన్
శోకంబందునె తజ్జ్ఞుఁ; డూఱడిలు నా సూనుండు నీ సూనుఁడే.” ॥208॥

వ. అనిన వసుదేవుండు నందునికి మఱియు నిట్లనియె. ॥209॥

క. “జనపతి కరి యిడితివి; మముఁ
గనుఁగొంటివి; మేము నిన్నుఁ గంటిమి; మేల
య్యెను; బొమ్మింకను గోకుల
మున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్.” ॥210॥

వ. అని పలికి వసుదేవుండు నందాదులైన వల్లవుల వీడ్కొలిపిన
వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటం
బులుగ నెక్కి తమతమ పల్లెలత్రోవలుపట్టి చని రా నందుండు
ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందరఁ బొడగని శౌరి తన
తోఁ బలికిన పలుకులు తప్పవనుచుఁ దలంచుచుండె నంత. ॥211॥

## 26 పూతన వ్రేపల్లెకొచ్చుట

సీ. కంసుపంపున బాలఘాతని పూతన
పల్లెల మందలఁ బట్టణముల
నిల యెల్లచో బాలహింస గావించుచుఁ
జనుచు నెవ్వని పేరు శ్రవణవీథిఁ
బడిన యంతన సర్వభయనివారణ మగు
నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందునిపల్లె కొకనాడు ఖేచరి
యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ
తే. గామరూపిణి యై చొచ్చి కానకుండ
నరిగి యిల్లిల్లు దప్పక యరసికొనుచు
నందగృహమున బాలునినాద మొకటి
విని ప్రమోదించి సుందరీవేష యగుచు. ॥212॥

మత్త. క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందుఁబొందని చందురుం
బోలు మోమును గల్గు లేదను బుద్ధి దూఱని కౌను హే
రాళమైన పిఱుందు పల్లవరాగ పాద కరంబులుం
జాల దొడ్డగు కొప్పు నొప్పగ సర్వమోహనమూర్తితోన్ ॥213॥

మాని. కాంచనకుండలకాంతులు గండయు
గంబునఁ గ్రేళ్ళుఱుకన్ జడపై
మించినమల్లెల మేలిమి తావులు
మెచ్చి మదాళులు మింటను రా
నంచిత కంకణహారరుచుల్ చెలు

వారఁగఁ బైవలు వంచల నిం
చించుక జారఁగ నిందునిభానన
యేగెఁ గుమారుని యింటికినై. ॥214॥

వ. ఆ సమయంబునన్. ॥215॥

## 27 పూతన బాలకృష్ణునిచూచుట

మ. "సిరి మమ్మున్ బ్రతుకంగఁజూచుకొఱకై శృంగారవేషంబుతో
నరుదేనోపు" నటంచు గోపికలు జిహ్వాల్ రాక మోహించి త
త్పరులై చూడ లతాంగి పోయి కనియెం బర్యంకమధ్యంబునం
బరు భస్మానలతేజు దుర్జనవధప్రారంభకున్ డింభకున్. ॥216॥

వ. కని కదియవచ్చు సమయంబున. ॥217॥

శా. ఆ లోకేశ్వరుఁ డా చరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని గొంటు కంటిడి వెసన్ బాలింతచందంబునన్
బాలిండ్లన్ విష మూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్
గాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టుచున్. ॥218॥

## 28 పూతన కృష్ణునిముద్దాడుట

క. ఆ పాపజాతి సుందరి
యా పాపని పాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్
మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్. ॥219॥

క. "చను నీకు గుడుపఁజాలెడి
చనువారలు లేరు; నీవు చనవలె" ననుచుం
"జనుఁగుడుపి మీఁద నిలుకడఁ
జనుదాన" ననంగ వేడ్కఁ జనుఁ జనుఁ గుడుపన్. ॥220॥

క. "నా చనుఁబా లొక గ్రుక్కెఁడు
నో! చిన్నికుమార! త్రావు మొయ్యన పిదపన్
నీ చెలువ మెఱుఁగ వచ్చును
నా చెలువము సఫల మగును నళినదళాక్షా!" ॥221॥

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం
జూచి. ॥222॥

## 29 పూతన కృష్ణునికిపాలిచ్చుట

మ. "వనితా! ముట్టకుమమ్మ; చన్నుఁగుడుప న్వల్దమ్మ; నీ చన్నుమా
తనయుం డొల్లఁడు; పాసిపొ" మ్మని యశోదా రోహిణుల్ చీరఁ గై
కొన కీక్షించుచు మాయఁ బన్ని పెలుచంగోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాటమెత్తఁదనమున్ లోవాడియు నేర్పడన్ ॥223॥

వ. కదిసి కలికి పలుకులు పలుకుచు నులుకుచెడి జళుకు చొరక
యెదుర నిదురంగదిరిన ఫణిని ఫణియని యెఱుంగక గుణమతిం
దిగుచు జడమతి బెడంగునఁ గఱటిజఱభితెఱవ వెరపునం జను
దెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గనుంగవం
దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరుమిగులు చిఱుతకొమ
రునిం దిగిచి తొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడ
నెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్ని యన్న! చన్ను
గుడువు మని చన్నిచ్చు సమయంబున. ‖224‖

## 30 పూతనసత్తువ పీల్చుట

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గనువిచ్చి
క్రేగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాకసంబునఁ జాఁచి
యొదిఁగిలి యాఁకొన్న యోజనూది
బిగిచన్నుగవఁ గేలఁ బీడించి కబళించి
గ్రుక్కగ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు
సైతము మేనిలో సత్వ మెల్లఁ
తే. ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ
జిమ్మ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలుర క్రియవాఁడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలు ననుచు. ‖225‖

## 31 పూతననేలగూలుట

క. నిబ్బరపు దప్పి మంటలు
ప్రబ్బిన ధృతి లేక నేత్ర పద హస్తంబుల్
గొబ్బున వివృతములుగ నా
గుబ్బనుచున్నట్టి కూఁతఁ గూలె న్నేలన్. ‖226‖

మ. అదరెం గొండలతోడ భూమి; గ్రహతారానీకముల్ మింటిపై
బెదరెన్; దిక్కుల మారుమ్రోత లెసఁగెన్; భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను; వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన దద్ఘోరుఘోషంబునన్. ‖227‖

క. అప్పుడు దెప్పరమగు నా
చప్పుడు హృదయములఁ జొచ్చి సందడిపెట్టన్
ముప్పిరిఁగొనిపడి రెఱుకలు
దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్ ‖228‖

క. ఆ జఱభి రండ రక్కసి
నైజశరీరంబు నేల నలియంబడినన్
యోజనమున్నర మేర ధ
రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా! ‖229‖

సీ. దారుణ లాంగూలదండ దంతంబులు
నగ గహ్వరముఁ బోలు నాసికయును
గండశైలాకృతి గల కుచయుగమును
విరిసి తూలెడు పల్ల వెండ్రుకలును
జీఁకటినూతులఁ జెనయు నేత్రంబులుఁ
బెనుదిబ్బఁ బోలెడి పెద్ద పిఱుఁదుఁ
జాఁగుకట్టలఁ బోలు చరణోరుహస్తంబు
లింకినమడువుతో నెనయు కడుపుఁ
తే. గలిగి షట్క్రోశ దీర్ఘమై కదిసి చూడ
భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి
గోపగోపీజనంబులు గుంపుగూడి
బెగడుచుండిరి మనముల బెదురు గదిరి. ||230||

వ. ఇ వ్విధంబునన్. ||231||

క. ఆ తఱిఁ గుడువఁగ నడచెను
నూతనఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు
ద్యోతనఁ గృతమునిసముదయ
యాతనఁ బూతన నెఱింగి యాతనలీలన్. ||232||

క. విషధరరిపుగమనునికిని
విషగళసఖునికిని విమల విషశయనునికిన్
విషభవభవజనకునికిని
విషకుచచనువిషముఁగొనుట విషమే తలపఁన్? ||233||

వ. అంత నా గోపగోపీజనంబులు దెలిసి రోహిణీయశోదలం గూడుకొని
బెగ్గడిలక డగ్గఱి. ||234||

శా. నేలంగూలిన దాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడించు నో!
బాలా! రమ్మని మూపుఁ జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజమున్ గోమూత్రముం జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పండ్రెండు నామంబులన్. ||235||

వ. మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబు జేసి దక్షులై,
మునుపుగాఁదమకు రక్షాకరంబగు బీజన్యాసంబుచేసికొని, చిన్ని
యన్న నీ యడుగు లజుండును జానువు లననిలుండును దొడల
యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుం
డును, హృదయంబు కేశవుండు, నురము నీశుండును, గంఠంబు
నినుండును, భుజంబుల జతుర్భుజుండును, ముఖంబు త్రివిక్ర
ముండును, శిరం బీశ్వండును రక్షింతురు; ముందు చక్రియు,
వెనుక గదాధరుండైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన
మధువైరియు నసిధరుండగు జనార్దనుండును, గోణంబుల శంఖ
చక్రగదాధరుండైన యురుగాయుండును, మీఁదు నుపేంద్రుడును
గ్రిందు దార్క్ష్యుండు, నంతటను హలధరుండగు పురుషుండును
గాతురు; నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల

నారాయణుండును, జిత్తంబు శ్వేతద్వీపపతియును, మనంబు
యోగీశ్వరుండును, బుద్ధిని బృశ్నిగర్భుండు, నహంకారంబున
భగవంతుండైన పరుండును బాలనంబుచేయుదురు; నీవు క్రీడిం
చునెడ గోవిందుండును, శయనించు తఱి మాధవుండును, నడ
చువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును,
గుడుచు కాలంబున సర్వభక్షకుం డయిన యజ్ఞభుజుండు నే
మఱకుండుదురు; నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహం
బులును, గూశ్మండ, డాకినీ, యాతుధానులును భూత ప్రేత
యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరాదులును జ్యేష్ఠాది
భూతనాథులును, మాతృకాదిగణంబులు నశియింతురు; నీ
యందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లైన యున్మాదంబులు
నపస్మారంబులును మహోత్పాతంబులును బొందకుండుంగావుత
యని రక్షచేసి దీవించి రంత. ||236||

క. ఆ పెద్ద వేడబంబుల
పాపనికిని జన్నుఁగుడిపి పానుపుపై సం
బ్రాపించి కప్పి "కూరుకు
మో పాపఁడ!" యని యశోద యొయ్యనఁ బాడెన్. ||237||

వ. అంత నందుండు మొదలయిన గోపకులు మథురనుండి వచ్చి
రక్కసి మేనుఁ గని వెఱఁగుపడి "మున్ను వసుదేవుం డుత్పాతం
బులెఱింగి చెప్పె; నతండు మహాయోగి" యని పొగిడి కఠోరం
బగు పూతన యొడలు గుఠారంబుల నఱికి తమ కుటీరంబుల
కుం దవ్వగు ప్రదేశంబున పటీరంబుల దహనంబు సంగ్రహించి
దహించిరి అంత. ||238||

ఆ. పొగిలిపొగిలి కాలు మగువదేహంబున
నగరు పరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ
ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య! ||239||

క. హరి దనమీఁదం బదములు
గరములు నిడి చన్నుగుడిచి కదిసినమాత్రన్
హరిజనని పగిదిఁ బరగతి
కరిగెను దురితములు బాసి యసురాంగనయున్. ||240||

క. వెన్నుని కొకమఱి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
వెన్నునిఁ గని పెంచుచుఁ దన
చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే? ||241||

క. హరిఁగని చన్నులు గుడిపెడి
తరుణులు ప్రాపించు పదము తలఁపఁగ వశమే?
హరి యారగించుటకుఁ బా
ల్గురిసిన ధేనువులు ముక్తి కొనలఁ జరించున్. ||242||

క. ఆ పూతన మెయిగంధము
గోపాలు రెజెంగి "యిట్టి కువనిత యొడలం
దీపాటి స్వాదుగంధము
ప్రాపించెనె" యనుచుఁ జనిరి పల్లెల కధిపా! ||243||

వ. అంత నందుండు పరమానందంబున నింటికిఁ జని ప్రేతలచేత
రక్కసిచేత లన్నియు నెఱింగి వెఱఁగుపడి పాపని లేపి శిరంబు
మూర్కొని ముద్దాడి ముదంబున నుండె;" నని చెప్పిన విని
పరీక్షిన్న రేంద్రుఁ డిట్లనియె. ||244||

క. "ఏయే యవతారంబుల
నే యే కర్మములు జేసె నీశుఁడు హరి భ
ద్రాయతనము లన్నియు వినఁ
బాయదు చిత్తంబు చెవులపండువు లయ్యెన్. ||245||

క. ఉరుసంసారపయోనిధి
తరణంబులు పాపపుంజ దళనంబులు శ్రీ
కరణంబులు ముక్తి సమా
చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్." ||246||

వ. అని "తరువాత బాలకృష్ణుం డేమి చేసె నా యందుఁ గృప గల
దేనిం జెప్పవే" యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె. ||247||

## 32 యశోద కృష్ణుని తొట్లనిడుట

సీ. "బాలకుం డొదిగిలఁ బడనేర్చెనని జన్మ
నక్షత్రమం దొకనాడు నందు
పొలతి వేడుకతోడఁ బొరుగుప్రేతలఁ జీరి
వాదిత్రగీతారవంబు చెలఁగ
విప్రులతోఁగూడ వేదమంత్రంబుల
నభిషేచనాదిక మాచరించి
వారి దీవెన లొంది వారికి మొదవులు
నన్నంబు చీరలు నడిగినట్టు
తే. లిచ్చి బాలుఁ దియ్యు మెసఁగఁ బానుపుఁ జేర్చి
నిదురఁబుచ్చి గోపనివహమునకు
గోపికలకుఁ బూజ గొమరారఁ జేయుచు
జనని కొడుకు మఱచె సంభ్రమమున. ||248||

వ. ఆ సమయంబున. ||249||

## 33 కృష్ణుడు శకటము దన్నుట

క. నిదురించిన శిశు వాకొని
కిదుకుచుఁ జనుఁ గోరి కెరలి కిసలయ విలస
న్మృదు చక్రచాపరేఖా
స్పద పదమునఁ దన్నె నొక్క బండిన్ దండిన్. ||250||

క. శకటము హరి దన్నిన దివిఁ
బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలంబడె
నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్. ||251||

వ. అప్పు డం దున్న సరసపదార్థంబులు వ్యర్థంబు లై నేలం
గూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు
పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బుచెడి వెఱపులు
ఘనంబులుగ మనంబులందుఁ గదుర. ||252||

క. మిన్నున కూరక నెగయదు
తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ
చిన్నికుమారుఁడు తేరే
విన్ననువున నెగసె దీని విధ మెట్టిదియో. ||253||

వ. అని వితర్కించు సమయంబున ||254||

క. "బాలకుఁ డాకొని యేడ్చుచు
గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే
మూలమున నెగయ దని త
ద్బాలుని కడ నాడుచుండి పలికిరి శిశువుల్." ||255||

వ. ఇట్లు శిశువులు పలికిన పలుకులు విని. ||256||

శా. "బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం
గాలం దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీ జడ్డు ప
ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక" యం
చాలపించుచుఁ బ్రేలు వ్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్. ||257||

వ. అప్పుడా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి. ||258||

ఆ. "అలసితివి గదన్న! యాకొంటివి గదన్న!
మంచి యన్న! యేడ్పు మాను మన్న!
చన్నుఁగుడువు మన్న! సంతసపడు మన్న!"
యనుచుఁ జన్నుఁగుడిపె నర్భకునకు. ||259||

వ. అంత న బ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకును గదా యని
శంకించి గోపకు లనేకు లనేక బలి విధానంబులు చేసిరి; బ్రాహ్మ
ణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి; ఋగ్యజు
స్సామ మంత్రంబుల నభిషేచనంబులు చేయించి స్వస్తిపుణ్యాహ
వచనంబులు చదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుండ
లంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యా
శీర్వాదంబులు గైకొని ప్రమోదించె" నని చెప్పి శుకుం డిట్లనియె. ||260||

## 34 వ్రేగయిన కృష్ణునిలపైబెట్టుట

క. “కొడుకు నొకనాడు తొడపై
నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గడుదొడ్డ కొండ శిఖరము
వడువున వ్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా! ॥261॥

క. బరువైన కొడుకు మోవను
వెరవిడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
ధరఁ గావఁ బుట్టిన మహా
పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్. ॥262॥

వ. అప్పుడు. ॥263॥

## 35 తృణావర్తుడు కొనిపోవుట

క. ఖరుఁడగు కంసునిపంపున
నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగాఁ
సురకరువలి యై బిసబిస
నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్. ॥264॥

క. సుడి యెఱుఁగని హరి సుడివడ
సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి కన్నుల
సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా! ॥265॥

వ. మఱియు నవ్వాలయపవనదనుజుండు విలయపవనుని తెఱం
గునంగసిమసంగి ముసరి మసరు కవిసి విసిరెడి సురకరువలిం
బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణి
కిరణములకు మఱుఁగుపడిన నిబిడ మగు బెడిదంపు తిమిర
మున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులంబు నొంద నొండొ
రుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనం
బగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున
దిగంతంబులు చెవుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్త
మాత్రంబున భువనభయంకరత్వంబు దోఁచె; నా సమయంబున. ॥266॥

ఉ. పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి “యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేడు గాలికిం
జేపడిపోయితే” యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం
దాపము నొంది నెవ్వగలడయ్యుచుఁ గుందుచు బిట్టు గూయుచున్ ॥267॥

క. “సుడిగాలి వచ్చి నిన్నున్
సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడు నా ముద్దుల
కొడుకా! యేమంటి” వనుచు “ఘోరం” బనుచున్ ॥268॥

ఉ. “ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా
నెక్కడినుండి వచ్చె శిశు వెక్కడి మార్గము పట్టిపోయె నే

నెక్కడఁ జొత్తు" నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూస్థలి వ్రాలె దురంత చింతయై ||269||

క. పాపనికై యిటు పొగిలెడి
యా పాపని తల్లిఁ జూచి యారటపడుచున్
గోపాలసతులు బాష్పజ
లాపూరితనయన లైరి యార్తిం బడుచున్ ||270||

శా. ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దోకొని పోయిపోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీ లేమిం బరిశాంత వేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడ నంచు నిటమీఁ దెట్లంచుఁ జింతించుచున్. ||271||

వ. అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున. ||272||

క. బాలద్విరద కరంబులఁ
బోలెడి కరములను దనుజు బొండుగు బిగియం
గీలించి వ్రేలఁ బడియెను
బాలకుఁ డొక కొండభంగి బరు వై యధిపా! ||273||

క. మెడ బిగియఁబట్టుకొని డిగఁ
బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁజాలక వాఁ డురిఁ
బడి బెగడెడు ఖగము భంగి భయముం బొందెన్. ||274||

క. హరి కరతల పీడనమునఁ
బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై
సురవైరిభటుఁడు గూలెను
బురభంజను కోలఁ గూలు పురముం బోలెన్. ||275||

వ. అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదం
బున విక్కవిరిసి రక్కసుని యురమున మురువు గలిగి బరు
వులేక వ్రేలు బాలునిం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చి
రప్పుడు గోపగోపికాజనంబు లందఱు దమలో నిట్లనిరి. ||276||

క. రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడు లందున్
రక్షణములు వెయి గలిగిన
శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. ||277||

మ. గత జన్మంబుల నేమి నోఁచితిమొ? యాగ శ్రేణు లే మేమి చే
సితిమో? యెవ్వరి కేమి పెట్టితిమొ? యే చింతారతింబ్రొద్దు పు
చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ? యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు చూడఁగంటిమిచటంగృష్ణార్భకున్నిర్భయున్ ||278||

వ. అని పలికి రంత నందుండు మున్ను దనకు వసుదేవుండు

జెప్పిన మాటలకు వెఱంగుపడుచుండె మఱియును. ||279||

## 36 పొలుతాగివిశ్వరూపప్రదర్శన

సీ. జననాథ! యొకనాడు చన్ను చేఁపినఁ దల్లి
చిన్నిముద్దులకృష్ణుఁ జేరఁ దిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి
చ న్నిచ్చి నెమ్మోము చక్క నివిరి
యల్లని నగవుతో నావులించిన బాలు
వదన గహ్వరమున వారినిధులు
దిశలు భూమియు వనద్వీపశైలంబులు
నేఱులు గాలియు నినుడు శశియు
ఆ. దహనుఁ డాకసంబు దారలు గ్రహములు
నఖిలలోకములు చరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ
జూచి కన్నుమోడ్చి చోద్యపడియె. ||280||

## 37 గర్గాగమనము

వ. అంత నొక్కనాడు వసుదేవు పంపున యాదవ పురోహితుం డైన
గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి
నిలిచి కృతాంజలి యై. ||281||

క. కోరి భజించెను నందుఁడు
సారగుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి
దూరితషడ్వర్గుఁ గుజన దుర్గున్ గర్గున్. ||282||

వ. మఱియుఁ దగిన సత్కారంబులు చేసి ఇట్లనియె. ||283||

క. ఊరక రారు మహాత్ములు
వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లం
గారణము మంగళములకు
నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా! ||284||

శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంతవి
ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని
ర్ణీతుండైన గురుండు మానవులకున్ విప్రోత్తముం డండ్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబుఁ గావింపవే. ||285||

## 38 రామకృష్ణుల నామకరణం

వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత
వ్రేటుపడి దివికెగసిపోయిన తెఱవ చెప్పిన తెఱంగు తేటపఱచి
దేవకీదేవి కొడుకని కృష్ణుని కంసుండు దలంచుఁ గావున రహ
స్యంబున సంస్కారంబు చేయుట కార్యం బని నం దానుమతం

బున రోహిణీకుమారు నుద్దేశించి. ||286||

క. జనులు రమియింపఁ దిరిగెడి
యనువు కలిమి రాముఁ డనియు యదు సంకర్షం
బున సంకర్షణుఁ డనియును
ఘన బలమున బలుడు ననియు గణుతించె నృపా! ||287||

వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణపీత వర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుం డయ్యెఁ; వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యెఁ; నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబు లనేకంబులు గల; వీ శాబకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు; రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబు సజ్జనరక్షణంబు నగు నీ కుమారుండు నారాయణ సమానుం” డని చెప్పి; తన గృహంబునకు నమ్మునీశ్వరుండు చనియె; నందుండును బరమానందంబున నుండె; అంత. ||288||

## 39 కృష్ణబలరాములక్రీడాభివర్ణన

సీ. జానుభాగముల హస్తములు వీడ్వడఁ జేసి
నిగుడు చల్లనఁ బోదు రింత నంత
నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు
రాలక్రేపుల తోఁక లలమి పట్టి
విడువ నేరక వాని వెనువెంట జరుగుదు
రప్పంకముల దుడు కడర జొత్తు
రెత్తి చన్నిచ్చుచో నిరుదెస పాలిండ్లు
చేతులఁ బుడుకుచుఁ జేపు గలుగ
తే. దూటుదురు గ్రుక్క గ్రుక్కకు దోర మగుచు
నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు
రామకృష్ణులు శైశవరతులఁ దగిలి. ||289||

క. తడ వాడిరి బలకృష్ణులు
దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడవాడి రరులు భయమునఁ
దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్. ||290||

సీ. తల లెత్తి మెల్లనఁ దడవి యాడెడు వేళ
పన్నగాధీశులపగిదిఁ దాల్తు;
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల
నేనుగుగున్నల నెత్తువత్తు;
రసమంబులైన జవ్వాడు లేఖంబుల
సింగంపుఁగొదమల సిరి వహింతు;
రాననంబుల కాంతు లంతంతకు నెక్కు
బాలార్క చంద్రుల పగిదిఁ దోతు;

తే. రెలమిఁ దల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి
పరమయోగోద్భవామృత పానలీల
సోలి యెఱుగని యోగుల సొంపు గందు
రా కుమారులు జనమనోహరు లగుచు. ॥291॥

క. చూడని వారల నెప్పుడు
జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చిన బాలక
చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. ॥292॥

క. నగవు లనవిద్య పోఁడిమి
నగుబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన
నగుమొగముల సతులఁ జూచి నగ నేర్చె నృపా! ॥293॥

క. అవ్వల నెఱుఁగక మువ్వరి
కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ
నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్. ॥294॥

క. అడుగులు వే గలిగియు రెం
డడుగులనే మన్నుమిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు
లడుగులు సడుగులును వదలి యడు గవనిఁబడన్. ॥295॥

వ. మఱియును. ॥296॥

## 40 హరిహరాభేదము చూపుట

సీ. తనువున నంటిన ధరణీ పరాగంబు
పూసిన నెఱిభూతి పూఁతగాఁగ;
ముందఱ వెలుగొందు ముక్తాలలామంబు
తొగలసంగడికాని తునుకగాఁగ;
ఫాలభాగంబుపైఁ బరగు కావిరిబొట్టు
కాముని గెల్చిన కన్నుగాఁగ;
గంఠమాలికలోని ఘననీల రత్నంబు
కమనీయ మగు మెడకప్పుగాఁగ;
ఆ. హారవల్లు లురగ హారవల్లులుగాఁగ;
బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱులేమిఁ దెలుప వెలయునట్లు. ॥297॥

క. ఆ పాపల విహరణములు
తీపులు పుట్టింప మరిగి తేఁకువ లే కా
గోపాల సతులు మక్కువ

నే పనులును మఱచి యుండి రీక్షణపరలై. ॥298॥

వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోఱ గోరు కొమ్ములు గల
జంతువులవలన నేమఱక, జలదహనకంటకాదుల యెడ మోస
పోక, బాలసంరక్షణంబు చేయుచు నుల్లంబుల మొల్లంబు లైన
ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత. ॥299॥

## 41 కృష్ణుడు బాలురతోతిరుగుట

క. తన యీడు గోపబాలురు
తనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం
దను గమనంబులఁ గృష్ణుఁడు
తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి మెఱసెన్. ॥300॥

వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ
దక్షుండై. ॥301॥

## 42 కృష్ణుని అలక

ఉ. చప్పుడు చేయకుండు మని జంకె యొనర్చిన నల్గిపోవఁగా
నప్పుడు బార చాఁచి తన యర్మిలి విందులు వచ్చి రంచు న
వ్వొప్పుఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు జేయుచు
న్నెప్పటియట్ల చన్గుడుచు నింపొలయన్ మొలగంట మ్రోయఁగన్. ॥302॥

## 43 కృష్ణుడు బువ్వపెట్టుమనుట

క. వల్లవగృహనవనీతము
లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిం
దల్లిఁ గదిసి చిట్టాడుచు
నల్లనఁ జను "బువ్వఁ బెట్టుమవ్వా!" యనుచున్. ॥303॥

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. ॥304॥

## 44 కృష్ణుని క్రీడాభివర్ణన

సీ. "గోవల్లభుఁడ నేను; గోవులు మీ" రని
వడి ఱంకె వైచుచు వంగి యాడు;
"రాజు నే; భటులు మీరలు రండురం" డని
ప్రాభవంబునఁ బెక్కు పనులుపనుచు;
"నేఁదస్కరుండ; మీరింటివా" రని నిద్ర
పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు;
"నే సూత్రధారి; మీ రిందఱు బహురూపు"
లని చెలంగుచు నాటలాడఁ బెట్టు;
తే. మూల లుఱుకును; డాఁగిలిమూఁతలాడు;
నుయ్యలల నూఁగుఁ జేబంతు లొనరవైచు;
జార చోరుల జాడలఁ జాల నిగుడు;

శౌరి బాలురతో నాడుసమయమందు. ||305||

## 45 గోపికలుకృష్ణయల్లరిచెప్పుట

వ. మఱియు నా కుమారశేఖరుండు కపట శైశవంబున దొంగజాడలం
గ్రీడింప గోపికలోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. ||306||

క. “బాలురకుఁ బాలు లే వని
బాలింతలు మొఱలుపెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము చేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! ||307||

క. పడఁతీ! నీ బిడ్డడు మా
కడవలలో నున్న మంచి కాఁగిన పా లా
పడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బో నడిచె నాజ్ఞ కలదో లేదో? ||308||

క. మీ పాపఁడు మా గృహముల
నా పోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నన్
గోపింపఁ బిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ! ||309||

మత్త. పుట్టిపుట్టఁడు నేడు దొంగిలఁ బోయి మా యిలు జొచ్చి తా
నుట్టి యందక ఱోలు పీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చై
పెట్టఁ జాలక కుండ క్రిం దొక పెద్ద తూఁ టొనరించి మీ
పట్టి మీఁగడపాలు చేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ! ||310||

క. ఆడం జని వీరల పెరు
గోడక నీ సుతుఁడు ద్రావి యొక యించుక తాఁ
గోడలి మూఁతిం జరిమినఁ
గోడలు మ్రు చ్చనుచు నత్త గొట్టె లతాంగీ! ||311||

క. వా రిల్లు చొచ్చి కడవలఁ
దోరంబగు నెయ్యిఁ ద్రావి తుది నా కడవల్
వీరింట నీ సుతుం డిడ
వారికి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ! ||312||

క. వేలుపులఁటె; నా కంటెను
వేలుపు మఱి యెవ్వఁ రనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్. ||313||

క. వెన్నఁ దినఁగఁ బొడగని మా
పిన్నది యడ్డంబు వచ్చి పిఱఁదికిఁ దివియన్
జ న్నొడిసి పట్టి చీఱెను
జిన్ని కుమారుండె యితఁడు? శీతాంశుముఖీ! ||314||

క. ఇమ్మగువ తన్ను వాకిటఁ
గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె
నమ్మా! యీ ముద్దు కుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా. ॥315॥

క. చేబంతి తప్పి పడెనని
ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలక మాడఁగ
నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక! తగునే? ॥316॥

క. ఇచ్చెలువఁ జూచి "మ్రుచ్చిలి
యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద; నాతో
వచ్చెదవా?" యని యనినాఁ
డి చ్చిఱుతఁడు; సుదతి! చిత్ర మిట్టిది గలదే? ॥317॥

క. కొడుకులు లేరని యొక సతి
కడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని పైఁ
బడినాఁ డిది వినుము శిశువు పనులే? తల్లీ! ॥318॥

క. "తలఁగినదానం దల" మనఁ
దలఁగక యా చెలికి నాన తలయెత్తఁగ "నీ
తలఁగిన చోటెయ్యది" యని
తల యూఁచెన్ నీ సుతుండు తగవె? మృగాక్షీ! ॥319॥

క. వ్రాలఁగ వచ్చిన నీ సతి
"చూలాలం దలఁగు" మనుఁడు "జూ లగుటకు నే
మూలంబు చెప్పు" మనె నీ
బాలుఁడు; చెప్పుదురె సతులు? పర్వేందుముఖీ! ॥320॥

క. మగువా! నీ కొమరుఁడు మా
మగవా రటు వోవఁ జూచి మంతనమునకుం
దగఁ జీరి పొందు నడిగెను
జగముల ము న్నిట్టి శిశువు చదువంబడెనే? ॥321॥

క. నమ్మి నిదురబోవ నా పట్టిచుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁ గట్టి
వీథులందుఁ దోలె వెలది! నీ కొమరుండు;
రాచబిడ్డఁ డైన ఱవ్వ మేలె? ॥322॥

క. నా పట్టి పొట్ట నిండఁగఁ
బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ;
డూపిరి వెడలదు; వానిం
జూపెద నేమైన నీవ సుమ్ము లతాంగీ! ॥323॥

క. తెఱవ యొకతె నిద్రింపఁగ

నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం
గఱపించి నీ కుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగియె విహితమె? సాధ్వీ! ||324||

క. నా కొడుకును నా కోడలు
నేకతమునఁ బెనఁగ బాము నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ
గూఁక లిడెన్ నీ సుతుండు గుణమె? గుణాఢ్యా! ||325||

ఆ. తరుణి యొకతె పెరుగుఁ దరుచుచుఁ దుది వంగి
వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి
మగువ! నీ సుతుండు మగపోఁడుములు చేయ
సాఁగినాఁడు తగదె? చక్కఁజేయ. ||326||

సీ. కలకంఠి! మా వాడ గరితల మెల్ల నీ
పట్టి రాఁగల డని పాలు పెరుగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దన త్రోవఁ
జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ?
తలుపుల ముద్రల తాళంబులును బెట్టి
యున్న చందంబుననున్న వరయ;
నొక యింటిలోఁ బాడు నొక యింటిలోఁ నాడు
నొక యింటిలో నవ్వు నొకటఁ దిట్టు;
ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కాన రాఁడు రిత్త కడవ లుండు. ||327||

క. కడు లచ్చి గలిగె నేనిం
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ! ||328||

## 46 గోపికలూరువిడిచెదమనుట

క. ఓ యమ్మ! నీ కుమారుఁడు
మా యిండ్లను బాలు పెరుగు మననీ డమ్మా!
పోయెద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ!" ||329||

## 47 యశోదగోపికలనొడంబరచుట

వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు చేయు వినోదం
బులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక
దూఱుచున్నయట్టి గోపికలకు యశోద యిట్లనియె. ||330||

క. "చన్ను విడిచి చనఁ డిట్టటు

నెన్నఁడుఁ బొరిగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేడుం
గన్నులు దెఱవని మా యీ
చిన్ని కుమారకుని ఱవ్వ చేయం దగునే? ||331||

క. అన్య మెఱుఁగఁడు; తన యంత నాడుచుండు;
మంచివాఁ డీత; డెగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార!" ||332||

వ. అని యశోద వారల నొడంబఱచి పంపి కొడుకుం గోపింపఁజాలక
యుండె నిట్లు. ||333||

ఉ. కాంతలు దల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁ డై
శాంతుని సొంపునం బరమ సాధుని పెంపున గోలమాడ్కి వి
భ్రాంతునికైవడిన్ జడుని భంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక దల్లికుచవేదికపైఁ దల మోపి యాడుచున్. ||334||

## 48 కృష్ణుడుమన్నుదినెననుట

వ. అంత నొక్కనాడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు
వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలుని కేలు
పట్టుకొని యిట్లనియె. ||335||

క. "మ న్నేటికి భక్షించెదు?
మన్నియమము లేల నీవు మన్నింపవు? నీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా! మ న్నేల మఱి పదార్థము లేదే?" ||336||

వ. అని పలికిన ముగుదతల్లికి నెఱదంట యైన కొడు కిట్లనియె. ||337||

శా. "అమ్మా! మన్నుదినంగ నే శిశువునో? యాఁకొంటినో? వెఱ్ఱినో?
నమ్మం జూడకు వీరి మాటలు మదిన్; న న్నీవుగొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీయాస్య గం
ధమ్మాఘ్రాణము చేసి నా వచనముల్ తప్పైన దండింపవే." ||338||

## 49 నోటిలో విశ్వరూపప్రదర్శన

వ. అని పలికి నెయ్యంబున న య్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజ
బాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన ||339||

క. ఆ లలితాంగి గనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్. ||340||

వ. కనుంగొని. ||341||

క. “కలయో! వైష్ణవ మాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
తలఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర
స్థలమో! బాలకుఁడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్ ॥342॥

ఆ. బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు
బాలు భంగి నితఁడు భాసిల్లుఁ గాని స
ర్వాత్ముఁ డాది విష్ణుఁ డగుట నిజము.” ॥343॥

వ. అని నిశ్చయించి. ॥344॥

ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు
గానఁబడిన బుద్ధి కంప మయ్యె
నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు
నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు. ॥345॥

క. నా మగడు నేను గోవులు
నీ మందయు గోపజనులు ని బ్బాలుని నె
మ్మోమున నున్న విధముఁ గని
యేమఱితిమి గాక యీశుఁ డీతఁడు మాకున్. ॥346॥

వ. అని తన్ను పరమేశ్వరుండని తలంచుచున్న యశోద యందు
నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. ॥347॥

క. జడనుపడి యెఱుక చెడి యా
పడతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని
కడు వేడుకతోడ మమతఁ గావించె నృపా! ॥348॥

వ. అనిన విని రా జిట్లనియె. ॥349॥

## 50 నందయశోదలపూర్వజన్మ

ఆ. జగదధీశ్వరునకుఁ జ న్నిచ్చు తల్లి గా
నేమి నోము నోఁచె నీ యశోద!
పుత్రుఁ డనుచు నతనిఁ బోషించు తండ్రి గా
నందుఁ డేమి చేసె! నందితాత్మ. ॥350॥

క. ప్రబ్బిన భక్తిని హరిపైఁ
గబ్బంబులు చెప్పి కవులు కైవల్య శ్రీ
కబ్బుదు రఁట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురొ? తుదిన్. ॥351॥

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె. ॥352॥

సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల
యందు ముఖ్యుఁడు; ధర యతని భార్య;
వారి నిద్దఱి బ్రహ్మ "వసుధపై జన్మించు"
డంచుఁ బంపిన వార లతనిఁ జూచి
"విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి
మా కిచ్చితేనిని మహి జనింతు"
మనవుడు "నట్ల కా" కనియె వేల్పులపెద్ద
యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె
ఆ. ధర యశోద య్యె; దనుజేంద్రవైరియుఁ
గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె;
నధిక భక్తితోడ నలరి నట్లు. ||353||

## 51 చిలుకుతున్నకవ్వంపట్టుట

వ. అంతనొక్కనాఁడు తనయింటికడ పాపలందఱునయ్యేపనులందుఁ
బంపుపడిపోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబు
కడఁ గుదురుగా నొక్క దధికుంభంబు పెట్టి మిసిమిగల మీఁగడ
పెరుగు కూడంబోసి వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలంవరించి. ||354||

సీ. కరకమలారుణ కాంతిఁ గవ్వపు త్రాడు
పవడంపు నునుఁదీఁగె పగిది మెఱయఁ;
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు
వీడ్వడ నొండొంటి వీఁక నొత్తఁ;
గుచకుంభములమీఁది కొంగుజాఱఁగ జిక్కు
పడుచు హారావళుల్ బయలుపడగఁ;
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మొము
మంచుపైఁ బడిన పద్మంబుఁ దెగడఁ;
తే. గౌను నులియంగఁ; గంకణ క్వణన మెసఁగఁ;
దుఱుము బిగివీడఁ; గర్ణికాద్యుతులు మెఱయ;
బాలు నంకించి పాడెడి పాట వలనఁ
దరువు లిగురొత్త పెరు గింతి దరువఁ జొచ్చె. ||355||

వ. ఆ సమయంబున. ||356||

క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు
సడి గొట్టుచు "నమ్మ రమ్ము; చన్ని" మ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ
గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్. ||357||

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు
న వ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి
దువ్వుచుఁ జన్నిచ్చె; నతఁడు దూఁటుఁచుఁ గుడిచెన్. ||358||

మ. కడుపారం జనుబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడు పాలు డించుటకునై యేగంగ దద్బాలుఁ డె
క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబుఁ బోగొట్టి తెం
పడరం గుంభములోని వెన్నఁ దినె మిథ్యా సంకులద్బాష్పుఁడై. ||359||

వ. అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన
దధికుంభ శకలంబులఁ బొడఁగని తుంటకొడుకు వెన్నదింట
యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చనిచని. ||360||

## 52 కోతికి వెన్నయిడుట

ఆ. వికచకమలనయన వే ఱొక యింటిలో
వెలయ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి
పాలు చేయుచున్న బాలుఁ గనియె. ||361||

## 53 యశోదకృష్ణుని అదిలించుట

మ. కని చేతన్ సెలగోలఁ బట్టికొనుచుం "గానిమ్ము కానిమ్ము రా
తనయా! యెవ్వరి యందుఁ జిక్కుపడ నే దండంబునుం గాన నే
వినివారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీవిటు నన్నుఁ గైకొనమి నేఁడారీతి సిద్ధించునే." ||362||

వ. అని యదలించుచు కొడుకునడవడిం దలంచి తనుమధ్య తన
మనంబున. ||363||

సీ. బాలుఁ డీతండని భావింతు నందునా
యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ పెఱుంగుటకు నై వెఱపింతు నందునా
కలిగి లే కొక్కఁడుగాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా
తనుదాన యై బుద్ధిఁ దప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
చొచ్చి చూడని దొకచోటు లేదు
ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి
యోజ లేదు భీతి యొక టెఱుంగఁ
డెలమి నూరకుండఁ డెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తిజేయు భంగి యెట్లు? ||364||

వ. అని వితర్కించి. ||365||

క. లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడనోపాయములన్
జాల గుణంబులు గలుగును
బాలురకును దాడనంబ పథ్యం బరయన్. ||366||

వ. అని నిశ్చయించి కేల నున్న కోల జళిపించి బాలా! నిలునిలు
మని బగ్గుబగ్గున నదల్చుచు దల్లి డగ్గఱిన బెగ్గడిలిన చందంబున
నగ్గలిక చెడి ఱోలు డిగ్గ నుఱికి. ||367||

క. గజ్జలు గల్లని మ్రోయఁగ
నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ
బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా! ||368||

వ. అప్పుడు. ||369||

మ. స్తనభారంబున డస్సి గ్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడ పాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగాలేని లీలారతున్. ||370||

వ. ఇట్లు గూడం జని. ||371||

## 54 కృష్ణుని ఱోలుకి కట్టుట

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డం బైన
నిట్టట్టు చని పట్టనీనివాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ
నే నని మునుముట్ట నేడ్చువాని
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు
వెడలు కన్నీటితో వెగచువాని
నే దెసవచ్చునో యిది యని పలుమాఱు
సురుగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ
ఆ. గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ
జిన్న వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. ||372||

వ. ఇట్లనియె. ||373||

క. "వీరెవ్వరు? శ్రీకృష్ణులు
గారా? యెన్నడును వెన్నఁ గానరఁట కదా!
చోరత్వం బించుకయును
నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే? ||374||

క. పట్టినఁ బట్టుపడని నినుఁ
బట్టెద నని చలముఁగొనినఁ బట్టుట బెట్టే?
పట్టువడ వండ్రు పట్టీ
పట్టుకొనన్ నాఁకుఁగాక పరులకు వశమే? ||375||

క. ఎక్కడనైనను దిరిగెద;

వొక్క యెడన్ గుణము గలిగి యుండవు; నియమం
బెక్కడిది నీకు? మఱచినఁ
జక్కగఁ బోయెదవు పెక్కు జాడలఁబుత్రా! ॥376॥

సీ. తోయంబు లివి యని తొలగక చొచ్చెదు;
తలఁచెదు గట్టెనఁ దరల నెత్త;
మంటితో నాటలు మానవు; కోరాడె;
దున్నత స్తంభంబు లూఁపఁ బోయె;
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు;
రాచవేఁటలఁ జాల ఱవ్వఁదెచ్చె;
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు;
ముసలివై హలివృత్తి మొనయఁ; జూచె
ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గలికి చేఁత లేల పుత్ర!
నిన్ను వంప వ్రాల్చ నే నేర ననియొ నీ
విట్టు క్రింద మీఁదు నెఱుఁగ కునికి." ॥377॥

వ. అని మర్మంబు లెత్తి పలికి. ॥378॥

క. ఆ లలన గట్టె ఱోలన్
లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియవా
గ్జాలుం బరివిస్మిత గో
పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్. ॥379॥

క. ఱోలను కట్టుపడియు న
బ్బాలుఁడు విలసిల్లె భక్త పరతంత్రుండై
యాలాన సన్నిబద్ధ వి
శాలమదేభేంద్రకలభ సమరుచి నధిపా! ॥380॥

క. వెలి లోను మొదలు తుది నడు
ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియున్ లో నగు నీశ్వరు
నలవడునే కట్టఁ బ్రణతురాల్ గాకున్నన్? ॥381॥

ఆ. పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని
గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెఱిఁగి నేనిఁ దల్లి యేల కట్టు? ॥382॥

క. చిక్కఁడు సిరికౌగిలిలోఁ
జిక్కఁడు సనకాదియోగిచిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావళిఁ
జిక్కె నతఁడు లీలఁ దల్లి చేతన్ ఱోలన్ ॥383॥

వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్టనడ
రుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు చుట్టిన నది రెండంగుళం

బులు కడమపడియె; మఱియు నొక్క బంధంబు సంధించి వలగొ
నిన నంతియ కొఱంతయయ్యె; వెండియు నొక్కపాశంబు గూర్చి
పరివేష్టించిన వెల్తిఁ జూపె నిట్లు. ||384||

క. తజ్జనని లోఁగిటం గల
రజ్జుపరంరపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జ
గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే? ||385||

వ. అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి; తదనంతరంబ ||386||

ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జాఱ
వీడి యున్న తుఱుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ
గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి. ||387||

క. బంధవిమోచనుఁ డీశుఁడు
బంధింపఁ బెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ
బంధంబునఁ గట్టుపడియెఁ బాటించి నృపా! ||388||

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు
నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడు పద్మజుఁడును గో
పాంగనక్రియఁ గరుణ పడయ రఖిలేశ్వరుచేన్. ||389||

క. జ్ఞానులచే మౌనులచే
దానులచే యోగ సంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే
శ్రీనాథుఁడు భక్తియుతుల చేతం బోలెన్? ||390||

వ. అంత న య్యశోద యింటికడం బనుల వెంటం దిరుగఁ గృష్ణుఁడు
తొల్లి నారదు శాపంబున నిరుమద్దు లై యున్న నలకూబర మణి
గ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని ఱో లీడ్చుకొని చనియె నని
చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె. ||391||

## 55 గుహ్యకుల నారదశాపం

క. "నారదుఁ డేల శపించెను?
వా రా వృక్షత్వమునకు వచ్చినపనికిం
గారణ మెయ్యది? యోగికు
లారాధ్య! యెఱుంగఁ జెప్పు మయ్య! వినియెదన్." ||392||

వ. అనిన శుకుండిట్లనియె "మున్ను కుబేరుని కొడుకు లిరువురు
శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలం
బాడెడి చేడియలం గూడికొని కరేణు సంగతంబు లైన యేనుం

గుల భంగి సురంగంబు లైన మందాకినీతరంగంబులం గ్రీడింప
నారదుండు వచ్చిన న చ్చెలువలు చెచ్చెర వలువలు ధరియిం
చిరి; మదిరాపాన పరవశులు గావున వార లిరువురు వివ
స్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు చూచి శపియించు
వాఁడై ప్రతీతంబగు గీతంబు బాడె; వినుము. ||393||

శా. సంపన్నుండొరుఁగాన లేఁడు తనువున్ సంసారము న్నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తుబడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సముల కాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. ||394||

వ. అని గీతంబు పాడి తన మనంబున. ||395||

క. కలవాని సుతుల మనుచును
గలకంతులతోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను; వీరికిఁ
గల క్రొ వ్వడఁగించి బుధులఁ గలపుట యొప్పున్. ||396||

వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర
మణిగ్రీవులఁ జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకం
బున నర్జున తరువులై నూఱుదివ్యవర్షంబు లుండుం డటమీఁద
గోవిందచరణారవింద పరిస్పందంబున ||397||

క. ముక్తులరై నారాయణ
భక్తులరై పరమసాధుభావశ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యము కతనన్. ||398||

వ. అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె
వారిరువురు సంగడిమద్దులైరి, పరమభాగవతుండైన నారదు
మాటలు వీటింబుచ్చక పాటించి. ||399||

## 56 కృష్ణుడుమద్దిగవనుగూల్చుట

క. ముద్దుల తక్కరిబిడ్డఁడు
మద్దులఁ గూల్పంగ దలఁచి మసలక తా నా
మద్దికవ యున్న చోటికిఁ
గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడకం జనియెన్. ||400||

వ. చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామ సమాకృష్య
మాణ తిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాకుల నడుమం
జొచ్చి ముందరికి నిగుడుచు. ||401||

క. బాలుఁడు ఱో లడ్డము దివ
మూలంబులు పెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా

పాలస్య వివర్జనములు యమళార్జునముల్ ॥402॥

## 57 గుహ్యకులుకృష్ణునిపొగడుట

వ. ఇట్లు నిర్మూలంబు లై పడిన సాలంబులలోనుండి కీలికీలలు
వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధు
లైన సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన
బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిడ్చి యిట్లనిరి. ॥403॥

క. "బాలుఁడవె నీవు? పరుఁడ వ
నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలారూప మండ్రు నిపుణులు కృష్ణా! ॥404॥

సీ. ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి
ప్రాణంబులకు నధిపతివి నీవ;
ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహత్తును నీవ;
వీని కన్నిటికిని విభుఁడ వీవ;
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ
సిద్ధుఁడ వగు నిన్నుఁ జింత చేయ
గుణయుతుం డోపునే? గుణహీన! నీ యంద
కల గుణంబుల నీవ కప్పఁబడుదు;
తే. మొదల నెవ్వని యవతారములు శరీరు
లందు సరిదొడ్డు లేని వీర్యముల తనువు
లడర జన్మించి వారల యందుఁ జిక్క;
వట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు. ॥405॥

క. భువనములు చేయఁ గావఁగ
నవతీర్ణుఁడ వైతి కాదె యఖిలేశ్వర! యో
గివరేణ్య! విశ్వమంగళ!
కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ! ॥406॥

ఉపేం. తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్;
నెపంబునం గంటిమి నిన్నుఁ జూడన్
దపంబు లొప్పెన్; మముఁ దావకీయ
ప్రపన్నులం జేయుము భక్తమిత్రా! ॥407॥

శా. నీ పద్యావళు లాలకించు చెవులన్ ని న్నాడు వాక్యంబులన్
నీ పేరం బనిచేయు హస్తయుగముల్ నీ మూర్తిపైఁ జూపులన్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్
నీ పై బుద్ధుల మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!" ॥408॥

వ. అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖల
బద్ధుండైన హరి యిట్లనియె. ॥409॥

క. "తమతమ ధర్మముఁ దప్పక

సములై నను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము నను౯ జూచిన విరియును
గమలాప్తు౯డు పొడమ విరియు ఘనతమము క్రియన్. ||410||

క. కారుణ్యమానసుండ గు
నారదువచనమున౯ జేసి నను౯ బొడ౯గనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరెన్ నామీ౯ది తల౯పు సిద్ధము మీకున్." ||411||

వ. అని యీశ్వరుండు మీరు "మీ నెలవులకుంబొం" డని యానతి
చ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కులిడి నలకూబర
మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి రంత; నందాదు లైన గోపాల
కులు నిర్మూలంబులై పడిన సాలంబుల చప్పుడు పిడుగు చప్పు
డని శంకించి వచ్చి చూచి. ||412||

క. "ఈ పాదపములు గూల౯గ
నీ పాప౯ డులూఖలమున నిట బద్ధుండై
యే పగిది బ్రతికె౯? గంటిరె;
వాపోవ౯డు; వెఱవ౯; డెట్టివా౯డో యిత౯డున్. ||413||

తే. పిడుగు పడదు; గాక పెనుగాలి విసరదు;
ఖండితంబు లగుట గానరాదు;
బాలు౯ డిత౯డు; పట్టి పడ౯ద్రోయ౯ జాల౯డు;
తరువు లేల గూలె ధరణిమీ౯ద" ||414||

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని
శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. ||415||

క. "నందుని కొమరు౯డు విను౯ డీ
సందున మును దూఱి ఱోలు సరి యడ్డముగా
ముందఱి కీడ్చిన మద్దులు
గ్రందుకొనం గూలె; జనుల౯ గంటి మిరువురన్." ||416||

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని మిథ్యా రూపంబు
లని కొందఱనిరి; కొందఱు నానావిధంబుల సందేహించిరి; అంత
నందుండు వికసిత వదనారవిందుం డగుచు౯ బట్టి కట్లు విడిచెను;
అట్టి యెడ౯ దన తెఱం గెవ్వరు నెఱుంగ కుండవలె నని తవర
కుమారుండు. ||417||

శా. పాడున్ మందుని భంగి; గోపవనితల్ పాణిధ్వనుల్ సేయ౯గా
నాడున్ జంత్రముకైవడిం; బరవశుండై హస్తముల్ త్రిప్పుచుం;
జూడన్ నేరని వాని భంగి జనులం జూచున్; నగున్; బాలురం
గూడుం బెద్దలపంపు చేయ౯జను; డాగున్; మట్టి౯ జిట్టాడుచున్. ||418||

క. “చుంచొదవుఁ బాలు ద్రావు ము
దంచితముగ” ననుఁడుఁ బాలు ద్రావి జననితోఁ
జుం చొదవ దనుచు లీలా
చుంచుం డై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా! ॥419॥

క. సెలగోల పట్టుకొని జల
కలశములో నీడఁ జూచి కలశయుతుండై
సెలగోలఁ బాపఁ డొకఁ డిదె
తలచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికి జెప్పెన్. ॥420॥

క. బిక్షులు వచ్చెద రేడ్చిన;
బిక్షాపాత్రమున వైచి బెగడించి నినున్
శిక్షించెద; రని చెప్పిన
బిక్షులఁ గని, తల్లిఁ గనియు భీతిల్లె నృపా! ॥421॥

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుఁ డుత్తరించుటయుఁ చూచి యే కాంతంబున నొక్కనాడు విచారింప నుపనందుం డను వృద్ధగోప కుండు తన యెఱుక మెఱసి యిట్లనియె. ॥422॥

## 59 బృందావనముబోవతలచుట

ఉ. “ఇక్కడనుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు చేయఁగా
రక్కసురాలు చన్నొసఁగె; జాలపయిన్ సుడిగాలి వీచెఁ; బై
గ్రిక్కిరియం దరుల్ వడియెఁ; గేశవు సత్కృపఁ దప్పెఁ; జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే? ॥423॥

క. కసవుగల దిరవు పసులకు
లస దద్రి నదీ మహీజ లతికావళిఁ బెం
పెసఁగును, గాపురమునకును
బొసఁగును బృందావనంబు పోదఁ డచ్చటికిన్.” ॥424॥

## 60 బృందావనమునకుబోవుట

వ. అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు “లిది యె కార్యంబు మందల” యని కొందల మందక యాలమందల నమంద గమనంబున ముందఱ నడవం బనిచి పిఱుందం గ్రందు కొనకుండ, బాల వృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తను త్రాణ తూణీర బాణధరులై విండ్లు పట్టుకొని నడవ, బండ్లవెనుకఁ గొమ్ములిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబుల నార్య పురోహిత సమేతులై వేడుకలు కొనలు నిగుడ మొన లేర్ప ఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు. ॥425॥

త. పసుపు లాడి యురోజకుంకుమ పంకశోభితలై లస
ద్వసనలై కచభారచంపకదామలై సులలామలై

పసిఁడిమాడల కాంతు లట్టులఁ బర్వఁ దేరులమీఁద బెం
పెసఁగ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్. ॥426॥

## 61 బృందావనముజొచ్చుట

వ. అప్పుడు రోహిణీయశోద లేక రథంబునఁ బరిపూర్ణమనోరథలై
రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమో
దంబు నొందుచుండి; రిట్లు గోపకులు బృందావనంబు జొచ్చి యం
దర్ధచంద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందలు విడి
యించి వసియించిరి. ॥427॥

క. చెందిరి బలమాధవు లభి
నందించుచుఁ బరమపావనము సంచిత కా
ళిందీ సంజీవనమున్
బృందావనమున్ మునీంద్ర బృందావనమున్. ॥428॥

వ. ఇట్లు బృందావనంబు చేరి కొంత కాలంబునకు రామకృష్ణులు
సమానవయస్కులైన గోపబాలకులం గూడుకొని వేడుక
లాదుకొన దూడలఁ గాచుచు. ॥429॥

సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో
గంతులు వైతురు గౌతుకమున;
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని
పరవృషభము లని ప్రతిభటింతు;
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జలు
మొఱయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ;
బన్నిదంబులు వైచి ఫలమంజరులు గూల్చి
వేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప;
తే. వన్య జంతు చయంబుల వానివాని
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు;
రంబుజాకారములఁ జల్లులాడఁ జనుదు;
రా కుమారులు బాల్యవిహారు లగుచు. ॥430॥

క. పోరుదురు గికురు పొడుచుచు;
దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్;
జాఱుదురు ఘనశిలాతటి;
మీఱుదు రెన్నంగరాని మెఁలకువల నృపా! ॥431॥

## 62 వత్సాసురవధ

వ. అంత నొక్కనాడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమా
రులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు క్రేపు రూపున
వచ్చి వారల హింసింపం దలంచి. ॥432॥

క. క్రేపుల యట్టులు నాకుచుఁ
గ్రేపులలో నిదియె మంచి క్రే పనఁగఁ గడుం

జూపట్టి భక్త సంగతిఁ
గ్రేపై చనువానిమ్రోలఁ గ్రేపై తిరిగెన్. ||433||

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి ||434||

చ. "ఇది యొక మంచిలేగ; వినుం డెంతయు నొప్పెడి" నంచు దాని త
త్పదములు తోఁకయున్ బిగియఁబట్టి చెలంగి వెలంగమ్రానితోఁ
జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం
గుదులుకొనంగ బాలకులు కోయని యార్వ నఖర్వ లీలతోన్. ||435||

వ. ఇట్లు రక్కసుండు వ్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలం
గూలెను; అప్పుడు ||436||

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ
జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణుని బొగడుచుఁ
ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్. ||437||

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి రి
వ్విధంబున. ||438||

క. వత్సముల పగిది జగముల
వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుంటన్
వత్సముల మేపు చుండియు
వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా! ||439||

## 63 దూడలదోలుకొనిపోవుట

వ. మఱియు నొక్కనాడు రేపకడ గోపకుమారులు క్రేపులంగొంచు నడ
వికిం జని యెండం బడి మెండుకొనిన దప్పిని బెండుపడిన తమ
తమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని
యొక్క కొలంకున నీరు ద్రావించి తారును జలపానంబు జని
వచ్చునెడ నందు. ||440||

## 64 బకాసుర వధ

క. అకలంకులు బాలురు గని
రకుటిలదంభోళిహతసితాద్రి శిఖర రూ
పకమున్ హరిహింసారం
భకమున్ బకమున్ విశాలభయదాంబకమున్. ||441||

వ. కని దాని యొడలిపొడవునకు వెఱఁగుపడి చూచు చుండ. ||442||

ఆ. ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁ డై
మౌనివృత్తి నితర మతము విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపైఁ దృష్టి

చేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె. ||443||

వ. ఇ వ్విధంబున నొదుగు పెట్టుకొని యుండి. ||444||

ఉ. చంచువు దీఁటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి, భీషణ ఘోషణ వక్త్రుడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్. ||445||

క. సంగడి లోకము లన్నియు
మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడు వేడుకకాఁ డటు
మ్రింగుడుపడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా! ||446||

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ
గనలేక బలాది బాలకప్రముఖు లచే
తనులై వెఱఁ గందిరి చ
య్యనఁ బ్రాణములేని యింద్రియంబుల భంగిన్. ||447||

వ. అట్లు మ్రింగుడుపడి లోనికిం జనక. ||448||

శా. కంఠోపాంతము దొడలున్ మెఱముచుం గాలాగ్ని చందంబునం
కుంఠీభూతుఁడు గాక వేండ్రమగు నా గోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురు న్మహామహిముఁ జక్కం మ్రింగ రాదంచు సో
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకం బశోకంబుగన్. ||449||

క. క్రక్కి మహాఘోషముతోఁ
జక్కగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
స్రుక్కఁగఁ బట్టి తృణము క్రియ
గ్రక్కున హరి చీరె బకునిఁ గలహోత్సుకునిన్. ||450||

వ. అప్పు డా నందనందనుమీఁద వేలుపులు చాలపులుగా నందన
మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి; దేవ
వాద్యంబులు మొరసె; రామాది గోపకుమారులు ప్రాణంబుల
తోఁ గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱ కృష్ణునిం గని
రమ్మని కౌగిలించుకొని కృష్ణసహితులయి లేఁగదాఁటుల మరల
దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి; వారలచేత నా
వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు. ||451||

క. "ఆపదలమీఁద నాపద
లీ పాపనిఁ జెంది తొలఁగె; నీ యర్భకుపై
వే పడిన ఖలులు దహనుని
పైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్." ||452||

వ. అని పలికిరి; మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచు తఱి. ||453||

సీ. కపులమై జలరాశిఁ గట్టుదమా యని
కట్టుదు రడ్డంబు కాలువలకు;
మునులమై తపములు మొనయుదమా యని
మౌనులై యుందురు మాటలేక;
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ
బాడుదమా యని పాడఁ జొత్తు;
రప్సరోజనులమై యాడుదమా యని
యాఁడు రూపముఁ దాల్చి యాఁడఁ జనుదు;
ఆ. రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా
యని సరోవరముల యందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుచరింపఁ గొమరు మిగుల. ॥454॥

## 65 చల్దులుగుడుచుట

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు కాంతారంబున బంతిచల్దులు గుడువ నుద్యోగించి ప్రొద్దునలేచి, గ్ర్దనం దమ యింటి లేఁగకదు పులం గదలించి, సురంగంబులగు శృంగంబులు పూరించిన విని, మేలుకని, సంరంభంబున గోప డింభకులు చలిది కావడులు మూఁపున వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టుకొని పదత్రాణ వేత్రదండంధరులయి, లెక్కకు వెక్కసంబైన తమతమ క్రేపుకదు పులం జప్పుడించి రొప్పుకొనుచు, గాననంబు జొచ్చి, కాంచన మణి పుంజ గుంజాది భూషణ భూషితులయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు తొడవులు గా నిడుకొని, కొమ్ములి మ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు జేయుచుఁ, బులుగుల నీడలం బాఱుచుఁ, బొదరిండ్లందూఱుచు సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులం జోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీగె యుయ్యెలల నూఁగుచు, పల్లంబులం డాగుచు, దూరంబుల కేగుచుఁ, గపుల సంగడిఁదరువులెక్కుచు ఫలంబులు మెక్కుచు రసంబులకుంజొక్కుచు నింగికిన్నిక్కుచు నీడలు చూచి నవ్వుచుఁ, గయ్యంబులకుఁ గాలుదువ్వుచు, చెలంగుచు, మెలం గుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకారంబుల శరీర వికారంబులు జేయుచు మఱియును. ॥455॥

క. ఒకనొకని చల్దికావిడి
నొకఁ డొకఁ డడకించి దాఁచు; నొకఁ డొకఁ డది వే
ఱొక డొకని మొఱఁగికొని చను
నొక డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా! ॥456॥

క. ఒక్కఁడు ము న్నేమఱి చన
నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్; వే
ఱొక్కఁడు మిట్టి తటాలున

నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్. ||457||

క. తీపుగల కజ్జ మన్యుఁడు
కోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం
బైపడి యది గొని యొక్కఁడు
క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా! ||458||

క. వనజాక్షుఁడు ము న్నరిగిన
"మునుపడఁగా నతని నేనె ముట్టెద" ననుచుం
జని మునుముట్టనివానిన్
మునుముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా! ||459||

వ. ఇ వ్విధంబున. ||460||

ఉ. ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాద పరాగ మింతయుం
గన్నులఁ గాన రట్టి హరిఁ గౌఁగిఁటఁ జేర్చుచుఁ జెట్టపట్టుచుం
దన్నుచు గ్రుద్దుచు న్నగుచుఁ దద్దయుఁబైఁపడి కూడి యాడుచుం
మన్నన జేయ వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే? ||461||

క. విందులకును బ్రహ్మాసుఖా
నందం బై భక్తగణమునకు దైవత మై
మందులకు బాలుఁ డగు హరి
పొందుఁ గనిరి గొల్ల; లిట్టి పుణ్యులు గలరే?" ||462||

## 66 అఘాసుర వధ

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. ||463||

క. "అమరు లమృతపానంబున
నమరిన వా రయ్యు నే నిశాటుని పంచ
త్వమునకు నెదుళ్ళు చూతురు
తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై. ||464||

క. బకునికిఁ దమ్ముఁడు గావున
బకమరణముఁ దెలిసి కంసు పంపున గోపా
లక బాలురఁతోఁ గూఁడను
బకవైరినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్. ||465||

క. "బాలురు ప్రాణంబులు గో
పాలురకు; మదగ్రజాతు ప్రాణము మా రీ
బాలురఁ జంపిన నంతియ
చాలును; గోపాలు రెల్ల సమసిన వారల్." ||466||

వ. అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు
పొడుపును, గొండతుదల మీఱిన కోఱలును, మిన్నుదన్ని
పన్నిన నల్ల మొగిళ్ళ పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గ

